# పల్లెటూరి ప్రజల నివేదనము

## అవునూరు

(ఒక విలేఖరి)

అవునూరు, సిరిసిల్ల తాలూకాయందుండు (కరీంనగరమునుండి, కామారెడ్డిపేటకు పోవు) రోడ్డునకు రెండుమైళ్ల దూరమున మానేరునదికి దక్షిణ దిగ్భాగమున గలదు. నూతనపరిగణననుసరించి యిచ్చటి గృహసంఖ్య (౫౦౪) జనసంఖ్య (౨౩౧౬) రెండువేలమూట పదునారు.

### కాలస్థితి

పునాస సాంతముగా విత్తబడినను, మక్క, జొన్న, పెసరమాత్రము కాలవర్షాధిక్యత వలన నెట్టుబడి పొత్తిగా చెడిపోయినవి, కావుననే కొందఱు రైతులు వాని యడుగున వేరు విత్తనముల బెట్టియున్నారు. వీరిపొలముల సాగుబడి సాంతమైనది. వర్షములకొరత యొంతమాత్రమును లేను.

### విద్యాస్థితి

ఈగ్రామము పూర్వమునుండియు, విద్యాధికులైన కరి (అవునూరు) పండితులగు దేశపాండ్యా ప్రముఖ సంస్థానమయ్యును విద్వదగ్రగణ్యులగు కొందరి విద్వాంసుల నివాసమయ్యును, ఇచట నొకచిన్న సాహాయక (యిండాది) పాఠశాల మాత్రమేయుండుట పౌరులకు విద్యాభివృద్ధియందుగల యాసక్తి యంతయును తెలియుచున్నది. దీనికితోడు ఉపాధ్యాయులగు కృష్ణమరాజు శ్రద్ధతో విద్యాభ్యాస మొనరించుట యగును. బడితెరువబడి యున్నకొలది దినములలోనైనను, కర్షకపు వ్రాతవలన చదువు చెప్పుటకు సరియగు సమయము చిక్కుట సంభవింపదు. కావుననే రిజిష్టరులో చేర్పబడియున్న (౬౫) గురు బాలురైనను క్రమముగా బడికి రాజాలరు. గాన సర్కారు జీతము ప్రభుత్వమువారిచే యివ్వబడుచున్నది గదా! యని వేతనమును పైత్రిక వృత్తిగా భావింపక తమకుగల యవకాశములో క్రమపద్ధతిపై విద్యాభ్యాసము చేయించుట యుచితమని యికనైనను బడిపంతులుగారు గమనింతురుగాక! మరియు పౌరులు తమబాలురను క్రమముగా బడికిపంపుచు బడిపంతులు యుత్సాహమును ద్విగుణీకృతము జేయుదురుగాక యని నమ్ముచున్నాము.

### పత్రికలు

గత వత్సరము నుండియు శ్రీయుత, అవునూరు వేణుగోపాలరావుగారి ప్రోత్సాహముచే గ్రామోద్యోగుల సహాయమున తెప్పింపబడుచున్న గోలకొండ పత్రికపై వారలు చందా నొసగని కారణమున నాపివేయబడు టెంతయు విచారకరము. విద్యావంతులగు వీరటు లొనర్చుట సమంజసముగాకుండెను. కావున, ఇకనైనను, ప్రోత్సాహమునిచ్చి తెప్పింపబడనున్న పత్రికారాజములకు సహాయ మొనర్చి, వాని యుపయోగమును తెలుసుకొనగలిగియు, తమ యభిమానమును వెలిబుచ్చుటకు వేడుచున్నాను.

### పారిశుద్ధత

ఈ గ్రామ మన్ని గ్రామములవలె గాక నలు దెసలను పచ్చని వరిపైరులచే నావరింపబడి యుండుటచేతను, గృహముల కానుకొనియున్న గొప్ప తటాకము గ్రామమునకు మిగుల సమీపమున నుండుటచేతను, గ్రామములోని భూమి తేమగా నుండుట సహజము. కావుననే కొలది వర్షము గురిసినను, వీధులన్నియు పంకిలమంతయునై నడుచుటకు వీలు కలుగకుండును. వర్షజల మెక్కడి దక్కడనే నిలచి యుండుటచే నెల్లపుడును బురద మడుగు లేర్పడి వానిపై దోమ లధికమగుచుండును. దీనికి తోడు కసువు పెంటలను ఇంటి ముంగిలిలో నేర్పరచుకొను పూర్వాచారము వలన నీ వర్షాకాలమున పెంటలు కుళ్ళి మిస్సహామగు దుర్గంధము గ్రామ మంతటను వ్యాపించుచుండును. దీనికి గ్రామాధికారులే మార్గదర్శకులనిన సత్యేతరము గాజాలదు. విద్యావంతులగు వీరే పురపారిశుద్ధతయం దుపేక్షభావమును జూపిన తదితరుల నేమనవలయును. కావున పురపారిశుద్ధతయందికనైనను, పౌరులు శ్రద్ధ వహించెదరు గాక! యని కోరుచు పారిశుద్ధశాఖవారి దివ్యదృష్టి నిటువైపు ప్రసరింప వారిని ప్రార్థించుచున్నాము.

### భావిశుభావహము

ఇచట కొందరుత్సాహవంతు లగు నవయువకులు "ప్రజాహిత సమితి"ని నెలకొలుప నున్నట్లు తెలియుచున్నది భగవంతుడు సత్వరముగా వారిప్రయత్నములను కొనసాగించుగాకయని వేడుచున్నాము.

## సన్ ౧౩౪౨ ఫసలీ కర్మము

ఖానాపురం

(ఒక విలేఖరి)

క॥ దయ ప్రజరక్షించుటకు నె
నరయు తపములు నవ్వరములు నరవర దానా
జయమును లక్ష్మియు నుంగీ
ర్తియు సుగతియు కలుగు వసుమతీ నాధునకున్॥
(శ్రీ మహాభారతము)

కావుననే శ్రీ॥ మా॥ ఘ॥ వ॥ నిజాం ప్రభువుగారు ప్రజలయెడ దయాహృదయులై దేశకాల పరిస్థితి గమనించి గత వత్సరము పునాస కిస్తునకు గడువు దయచేయుటయేకాక ఆబీకిస్తులో ౧/౪ వంతు మాఫీ కూడా దయచేసిరి. ఈ ఔదార్యములకు ప్రజలు పలువిధముల కొనియాడిరి. ఈ సంవత్సరము గత వత్సరముకన్న కటువుగా నున్నది. వర్షములు లేక పునాస పంటలు పొత్తిగా అడుగంటినవి. కొలది గొప్ప కొన్ని ప్రాంతములందు ఫలించినను నిన్న నేడు పడుచున్న వృత్తగ కాత్తి వర్షములవల్ల యీ స్వల్ప ఫలితమును కూడా రైతు పొందజాలక నిస్సహాయులగుచున్నారు. పునాసకిస్తు దాఖలు చేయుటకు యెట్టి ఆధారము కన్పించుట లేదు. కొన్ని చర్లలో నకాలమునకు నీరురాక అబీ సేద్యమే కాలేను. కొన్ని చెర్లు అతి వర్షముల వలన తెగిపోయినవి. కొన్ని ప్రదేశములందు వరినాట్లు పూర్తికాక పూర్వమే నీరు లేక యెండిపోయినవి. బావుల ఆధారములుగల వారలు మాత్రము పశువులకు మేతకును ముందుగను లాగి ప్రయాసపడిరి. ఈ సంవత్సరము ప్రభుత్వమువారు ప్రజల యెడ నేరీతిన తమ పుదారమును కనుపరచెదరో యని చంద్ర చకోర న్యాయముగా నిరీక్షించుచున్నారు. కావున దేశ నాయకులు ప్రచారకుల వల్ల సంఘ సభ్యుల వలన దేశకాల పరిస్థితులను ప్రతి తాలూకాలోను ప్రత్యేకముగా కనుగొని ప్రజల కష్ట నష్టములు దొరతనమువారి దృష్టికి రప్పించి యీ సంవత్సరము కూడా గత సంవత్సరమువలెనే ప్రజలకు సౌకర్యములు కలిగించుటకు శ్రద్ధ వహింతురుగాక యని ప్రార్థన.

## ఖమ్మం

(ఒక విలేఖరి)

రమారమి ౧౫ సంవత్సరముల క్రిందట యిచ్చటి గల ప్రముఖులు భాషాభిమానులు కడు శ్రమ ప్రయాసలతో జ్ఞాన విద్యుత్ప్రవాహిని ఆంధ్ర భాషా నిలయమను గ్రంథాలయము స్థాపించుటకై భవనమును శాశ్వతమైన కట్టుబాటుతో నిర్మించిరి. పిమ్మట చందాదారులను చేర్చి ప్రబంధములు నాటకములు నవలలు మొదలగు సుప్రసిద్ధములైన గ్రంథరాజములను వందలకొలది నగసు నెంబర్లతో అల్మారులలో జాగ్రత పరచి సరియైన నియమములతో కొన్ని వర్షముల వరకు అన్యత్తులంకను ఏకగ్రీవులై కార్యనిర్వాహణ దీక్షా పరతంత్రులై నిర్విఘ్నముగా గ్రంథాలయమును పోషించుచు నట్టేటిలో పుట్టమునిగినట్లు ఏకారణముననో ఔన్నత్యముతో యలరారుచున్న యీ గ్రంథాలయము కవాటములకు తాళము వేయబడెను. ప్రేక్షకులు యెంత కాలము నిరీక్షించినను బంధించబడిన కవాటములు తెరువబడవయ్యెను. యిట్లు వత్సరములు గడచినవి. యిందుగల గ్రంథరాజములు యీ నిరాదరణను సహింపలేక కాబోలు "గుమ్మడికాయకే కాళ్లు వొచ్చి గున గున నడిచెనా" అను విధమున తమంతట తామే అదృశ్యములాయెను. యిది యిటులుండ,

యింత మించుగా యీ గ్రంథాలయముతో పాటు ఖమ్మం హైస్కూలు విద్యార్థులు బాల్య దశలో వున్నను ఒక గ్రంథాలయమును స్థాపింప సంకల్పితులై "విద్యార్థి సంఘము" అను సార్థక నామముతో యీ సంఘమును ఒక అద్దె గృహమున స్థాపించిరి. కొలది కాలములో స్థానిక విద్యార్థులు మాతృ భాషాభివృద్ధికై కడు ప్రయత్నించి అనేక ప్రబంధములు నాటకములు నవలలు వార్తాపత్రికలను చందా ధనమూలమున తెప్పించి గ్రంథాలయము నభివృద్ధిపరచి నందులకు యీ సంఘాధ్యక్షులు యెంతయో ప్రశంసా పాత్రులు. యీ విద్యార్థి సంఘాభిమానులు [illegible] సంవత్సరము వరకు ఎట్లో అద్దెగృహమునందే శ్రమ [illegible] నిర్వహించుచూ ఆకస్మికముగా మూయబడిన గ్రంథాలయము తెరువబడక నిరుపయోగముగ నుండుటను చూచి శ్రీ జ్ఞాన విద్యుత్ప్రవాహిని ఆంధ్ర భాషానిలయాధ్యక్షులతో యీ గ్రంథాలయమును విద్యార్థి సంఘమునకు యిప్పించ కలసినంతగా పలు విధముల ప్రార్థింపగా యిట్టకేలకు జ్ఞాన విద్యుత్ప్రవాహిని ఆంధ్ర భాషానిలయాధ్యక్షులు దయాహృదయులై విద్యార్థి సంఘమును అద్దెబాధనుండి తప్పించుట భాషా సేవ జరుగుటయే ముఖ్యమని భావించి కాబోలు యీ గ్రంథరాజమును విద్యార్థి సంఘ సభ్యుల స్వాధీన పరచినందులకు జ్ఞా॥ వి॥ ఆ॥ నిలయాధ్యక్షులు కడు వందనీయులు.

విద్యార్థి సంఘము స్థాపించినదాది నిర్విఘ్నముగా కొనసాగుచున్నందులకు యెంతయు శ్లాఘనీయము. యీ సంఘమునకు ఆంధ్ర [illegible] గృహలక్ష్మి మున్నగు దిన, వార మాస పత్రికలు కూడా వచ్చుచుండుట పౌరులకు ఆనంద దాయకముగా నున్నయది. కాని యీ సంఘమునకు మన నిజాంరాష్ట్రమునందు ఆంధ్ర భాషలో వెలువడుచున్న "గోలకొండ" పత్రికారాజము లేకపోవుటచే యీ రాష్ట్ర వార్తలు మాతృభాషలో తెలుసుకొను అవకాశము లభించనందులకు కడు చింతించుచున్నాము. ఏకారణము చేత యీ సంఘకార్యదర్శి యీ పత్రికారాజమును తెప్పించుట లేదో తెలియకున్నయది. కొంతకాలమువరకు శ్రీ గోలకొండ పత్రికాధిపతులు యీ విద్యార్థి సంఘమునకు తమ పత్రికారాజమును ఉచితముగా పంపిడి ఔదార్యమును మేలుగా నిలిపివేసిరి. నాటినుండి యీ సంఘమువారు యీ పత్రికను తెప్పింపజాలకుండిరి. సాంఘికులు మాత్రము [illegible] చందా ధనము కొరకు పలుమారులు [illegible] కడు వ్యయము జరుగుచున్న దనుటకు సందియము లేదు. జరుగుగాక, మన రాష్ట్రమున ఆంధ్ర భాషాభిమానులలో సుపాఠకులవలె ప్రకాశించెడి పత్రికారాజము లేకపోవుటచే త్వరలో నొలగింపగలందులకై విద్యార్థి సంఘ కార్యదర్శిగారు సూచించుచు సాహసించినందులకు క్షమించ వేడుచున్నాను. ఈ సంఘమును స్థాపించిన దాది యెన్నడు వార్షికోత్సవము జరిగియుండలేదు. గత వత్సరములకై విచారపడుటకు మారు యిప్పటి నుండి ప్రతి వత్సరము వార్షికోత్సవము జరిపి యీ ప్రాంత సభ్యులను సెల్లరను సంతసింపజేయ ప్రార్థన.

## హైదరాబాదులో ప్లేగు

హైదరాబాదులో మరికొన్ని సమయములందుకి ప్లేగుతగిలినట్లు తెలియుచున్నది. ౧౯ వ తేదినాడు సుల్తానుసాహీయందు ౭౭౫ నెం యింటిలో ఒక చచ్చినయెలుక కనుగొనబడినది. దాని వైద్యులు పరీక్షింపగా ప్లేగువలన చచ్చియుండినట్లుగను తెలియుచున్నది.

మస్జిదాబాదు హెల్తుక్యాంపులనుండి మరియొక ప్లేగువార్త తెలియుచున్నది. ౨౦ వ తేదినాడు హైదరాబాదు ఐసోలేషన్ హాస్పిటలునందు ఉంచబడిన మహమ్మద్ యూసిఫ్ సాహెబుకు ప్లేగుతగిలి కుడిచంకక్రింద ఒకబొబ్బయు, గజ్జలలో ఒకబొబ్బయు లేచినవట వారికి ప్లేగుతగులుటకు నాల్గురోజుల క్రిందటనే టీకాలు వేసిరి.

మొహల్లా బాయోలి గులాబ్ సింగులోనుండు ఖాజా మహబూబు భార్యయైన ౨౦ యేండ్ల పడుచు జాడదానికికూడ ప్లేగుతగిలినట్లును వైద్యపరీక్షలో ఆమె యెడమచంకక్రింద ఒకబొబ్బ అగపడినట్లును కూడ తెలియుచున్నది. మొహల్లా బాయోలి గులాబ్ సింగులో ప్లేగుకేసులు అధికముగా సంభవించినందున అచ్చటివారిని యితరస్థలములకు పోవునట్లును, హెల్తుక్యాంపులలో మాత్రము ప్లేగుకాలమందు ఉంచుటకు సమ్మతించినట్లునుకూడ తెలియుచున్నది.

గోలకొండ పత్రిక

అంగీరస నామ సం॥ భాద్రపద బ॥ ౧౩

బుధవారము

# మహాత్ముని జయము

1932వ సంవత్సరము, సెప్టెంబరు నెల, 24వ తేది, భారతవర్ష చరిత్రయందు మరియొక గొప్ప ఘట్టమైనది. మాంటుఫర్డు సంస్కరణములు బీజము వేసినాటిన భారతీయ విభేదవిషవృక్షము యొక్క పరిణామమే యీ నాటి ఖేదములకు కారణముఅయినది. ఇటీవల బ్రిటను నందు అధికారమునకు వచ్చిన జాతీయ ప్రభుత్వముకూడ అవిభేదాంకురమును గొప్పవృక్షమును చేసి ఊడలు దిగునంతకాలము దానికి రక్షణను కల్పించి ఊడబెరుకుటకు సాధ్యముకానిదానినిగా చేయదలపెట్టెను. మాంటుఫర్డు సంస్కరణములు ఏర్పరచిన ప్రత్యేకనియోజకవర్గములను హిందువులలోనే అతృప్తి జెందినయెందరో యాక్షేపించిరి. జాతీయప్రభుత్వము వారు దానినవకాశముగా గైకొని హిందూసంఘమును తమ సాంఘికసమస్యా పరిష్కారముతో చీలదీయదలచిరి.

గాంధిమహాత్ముడు యిందుకు క్షణమాత్రమును సమ్మతింపలేదు. ఎన్నియో అతృప్తికారణములున్నను, ఎన్నికష్టములనో యనుభవించుచున్నను హిందువుల సంఘమును యెంతోకాలమునుండి విడనాడకయున్న అస్పృశ్యులు యీనాడు ప్రభుత్వప్రకటనచే చీలదీయబడి, ఆత్మేతర హిందువులతో దినదినప్రవర్ధమానమై శాశ్వతము కాగల వైరమును దెచ్చుకొనుట మహాత్మునికి హృదయశల్యమాయెను. బ్రిటీషు ప్రధానామాత్యుడు ప్రకటించిన నిమ్నజాతి ప్రత్యేకనియోజకవర్గ పద్ధతి సెప్టెంబరు 20వ తేదిలోపల విడనాడబడనిచో 20వ తేదీ నాడు తాను ప్రాయోపవేశము ప్రారంభించెదనని మహాత్ముడు ప్రతిజ్ఞచేసెను. మహాత్ముడు 20వ తేది రాగానే తనప్రాణమును దేశైకమత్యసిద్ధికై బలియిచ్చుటకు పూనుకొనెను.

భారతహృదయము భీతివ్యాకులత జెందెను. మహాత్ముని యుపవాసమువలన భారతీయులకు తప్పక నే నిర్ణయింపదగిన తీవ్రసమస్యలేర్పడెను. ఇక జన్మజన్మాంతరములకైనను దొరకునో దొరకదో యను నంతటి గరిమగల్గించునంత నాయకశ్రేష్ఠుని గాంధీమహాత్ముని స్వరాజ్యసిద్ధికిముందే పోగొట్టుకొనుటయా, లేక బుద్ధిపూర్వకముగనో, మరి యితరకారణములవలననో యింతకాలము పేక్షించిన అస్పృశ్యుల న్యాయకాంక్షలను యిపుడు తీర్చి వారిని తృప్తిపరచుటయా అను విచారము ప్రతిమాగ్రవర్ణ హిందువుని హృదయమును కలవరపెట్టసాగెను. అట్లే, తమకొరకై జీవితమును వదలదలచిన గాంధిమహాత్ముని తమక్షేమమును భవిష్యత్తునందుకూడ ఎటువంటి సంఘర్షణలతో నిమిత్తములేకుండునట్లు కాపాడగలందులకై తమను కృపయుంచుకొనుటయా, లేక యెట్టైనను ప్రత్యేకనియోజకవర్గముల తాత్కాలికసుఖమును సంపాదించుకొని యుభయభ్రష్టులగుటయా యనుభీతి అంత్యజుల హృదయములను జొచ్చెను.

గతించిన ౫౩
మూడు ముళ్లై తొమ్మిది
నెలలు దాటి
౩౨ దినములైనది

ఇటుల త్రాసుయొక్క యిరుప్రక్కలను తూకము సరిపోగా ముఖ్యస్థైర్యస్థితికి వచ్చుటకు అవకాశమేర్పడెను. అస్పృశ్యులలో ప్రత్యేకప్రాతినిధ్యము గోరినవారు అంబేడ్కరుగారి యనుచరులు మాత్రమే. కావున యిప్పుడు సమాధానము కుదురవలయునన్న ముఖ్యముగా మహాత్మునికి అంబేడ్కరుగారికిని సంప్రతింపులు జరుగవలసినటులాయెను. జాతీయైక సంధి యత్నములు ప్రారంభము చేయబడెను. అగ్రవర్ణ హిందూ నాయకులు అంత్యవర్ణుల క్షేమమునకు తమ వారెవరును యిక మీదట అడ్డుపడకుండ వారిస్థితి మంచిదశకు వచ్చుటకవకాశము గల్పించుచు, సమిష్టి నియోజకవర్గపద్ధతి ననుసరించి శాసనసభలయందును మొత్తపుహిందువుల స్థానములలో బ్రిటిషుప్రభుత్వము వారిచ్చిన స్థానములకంటె ఎక్కువ స్థానములను అంత్యవర్ణములవారికి ప్రత్యేకముగానుంచుటకు యిష్టపడిరి. అంబేడ్కరుగారును గాంధీగారితో ముఖాముఖిగా మాటలాడుటయందు వారి నిష్కపటహృదయమును కనుగొనినంతటనే అంత్యవర్ణుల విషయమున మహాత్మునికభీష్టమగు పద్ధతిని ఒప్పుకొనుటకు మనస్సును సిద్ధముజేసికొనిరి. కావుననే యిరుపక్షములవారికిని యింతకు ముందుకుదురని సమాధానమిప్పుడు కుదిరెను. అగ్రవర్ణనాయకులు, అంత్యవర్ణుల భావిక్షేమము విద్యపై ముఖ్యముగా నాధారపడియుండుట గనుక వారివిద్యాభివృద్ధికై రాజ్యముయొక్క ఆదాయములో కొంతభాగమును ప్రత్యేకము వెచ్చించుటకుకూడ ఒప్పుకొనిరి. అట్లే అంత్యజుల క్షేమము కొంతవరకు వారిప్రభుత్వాధికారముపై కూడ నాధారపడియుండును కనుక జానమునుసరించి వారికి వారి సోదర హిందువులతోపాటు తగినన్ని ప్రధానప్రభుత్వోద్యోగములు వశముచేయునట్లుగ మనించుటకుకూడ అగ్రవర్ణులు ఒప్పుకొనిరి. నాల్గు రోజులుత దేశనిష్ఠతో సంప్రతింపులు జరిగి తుదకు 24వ తేదీనాడు పైసూచించిన షరతులపై సమాధానపడుటకు అన్నిపక్షముల అంత్యవర్ణులును అగ్రవర్ణులును ఒప్పుకొనిరి. మాన్గొనేలుగారును తన మాటను చెల్లించుకొనిరి. ఇట్లు హిందూసంఘమునుండి చీలబోవుచున్న నిమ్నజాతులు హిందూసంఘ మహాసౌధమునకు యిరుపస్తంభములుగా జేయబడినారు. సమిష్టినియోజకవర్గమాత్రము ననుసరించి అగ్రవర్ణ హిందువులకును అంత్యవర్ణ హిందువులకును సమాధానము కుదురుటచూడగా మహమ్మదీయులకుగూడ అదేసూత్రముననుసరించి హిందువులతో సమాధానము కుదురవచ్చునను ఆశపొడముచున్నది. చెన్నపురిలో తిలక్ ఘట్టమువద్ద 26వ తేదినాడు జరిగిన పౌరమహాసభయందుపన్యసించుచు మౌలానా యాకూబు హుసేను గారిట్లు నుడివిరి. "జాతీయవాదసభ్యుల వలన తమ సంఘముయొక్క క్షేమాభివృద్ధులు భద్రముగానుండవనిమోడి భీతిచే మహమ్మదీయులు తమకు ప్రత్యేకనియోజకవర్గములు కావలయునని కోరుచున్నారు. ప్రస్తుతము నిమ్నజాతులవారితో ఉన్నతకులములవారేర్పరచుకొన్న ఒడంబడికననుసరించి యితర సంఘములవారిలోగూడ యిట్టిసమాధానముల నేర్పరచుకొనుట సాధ్యమని తోచుచున్నది. చెన్నరాష్ట్రములో మాత్రమే యిచ్చట భారతక్రైస్తవుల ఆందోళనవలన భారతక్రైస్తవ సంఘమునకు ప్రత్యేకనియోజకవర్గము లేర్పరుపబడినవి. భారతక్రైస్తవులు సైతము సంయుక్తనియోజకవర్గములనే యామోదింపదగును. కావున నాయకులెల్లరును ఇందునుగూర్చి పట్టుదలవహించి సభలనుజరిపి భారతక్రైస్తవులతో నొకయొడంబడిక యేర్పరచుకొనిన మహమ్మదీయులుసైతము రాగలరు."

ఈ కోరికల సిద్ధికింతవరకు విఘ్నమును కల్గించినది మనస్సునందలి భీతిమాత్రమే కావున యిప్పుడీకోరికలు తీరవచ్చునను యాశకు అవకాశము కల్గుచున్నది. అట్లుత్వరలోనె కవేరిన భారతదేశమునందంతయువెంటనే శాశ్వతశాంతినిలకొనును కావున హిందూమహమ్మదీయ క్రైస్తవనాయకులెల్లరును ఉదారబుద్ధితో మార్గదర్శులై అందరికిని సమ్మతమగు సమాధానమును త్వరలో కుదుర్చుకొనగలరని నమ్ముచున్నాము.

---

## స్థానికవార్తలు

### భారతీయ పారిశ్రామిక ప్రదర్శనము
### హైదరాబాద్ దక్కన్
### బులెటిన్ నెం. ౧

౧. రాబోవు దసరాపండుగలలో హైదరాబాదునందు భారతీయ స్వదేశవస్తుప్రదర్శనము నొకదానిని జరుపుటకు నిశ్చయము జరిగినది.

౨. కొద్దికాలమునుండి స్వదేశవస్తువులపై అభిమానము హెచ్చైనది. అయినను అవి యెచట తయారుచేయబడునో యెచటదొరకునో జనసామాన్యమునకు తెలియకుండుటచే కొనవలచినవారికి చాలాయిబ్బంది కలుగుచున్నది. అటులనే తయారుచేయువారికిగూడ వారివస్తువులను పలువురకు తెలియునట్లు చేయవలెనన్న యిటువంటి ప్రదర్శనములకన్న మరియొక సులభతరమార్గములేదు. కాబట్టి యీప్రదర్శనమును యేర్పాటుచేయువారు వస్తువులను తయారుచేయువారికిని కొనువారికిని అత్యంతసమీపసంబంధమును కలుగచేయగలవారగుచున్నారు.

౩. ఇందునిమిత్తము ప్రదర్శనీయములగు వస్తువులను పంచుటకై మధ్యలో రెండు మంచికట్టడములుకల ఒకస్థలము సంపాదింపబడినది. కావలసినప్పుడు ప్రదర్శనస్థలమును యెక్కువచేసికొనుటకుగూడ అవకాశము తగినంతగలదు.

౪. ప్రదర్శింపబోవువస్తువులను తరగతులవారిగా విభజించి ఒక్కొక్కతరగతికి ఒక్కొక్కగది వదలవలసినదని యనుకొనబడినది. స్వయముగా వచ్చుటకు వీలులేనిప్రదర్శకులకు ప్రత్యేకముగ ఒకహాలు ఏర్పాటుచేయబడియున్నది. వస్తువులను తయారుచేసినపద్ధతులను బోధపరచుటకై సాధ్యమైనంత సహాయము చేయబడును. కావలసినవారు వారికికావలసిన అనుకూలముల వివరములను తెల్పుచు స్థలమును కోరవచ్చును.

౫. యల్. యన్. యమ్. అండ్. యస్. యమ్. యస్. వి, జి. వి. పి, బి. యన్. రైల్వేలు ప్రదర్శనవస్తువులకు సగము ఛార్జి తగ్గింపుటకు ప్రార్థించుచున్నాము. మరి ఘ॥ నిజాముసర్కారువారుగూడ సుంకములు వసూలుచేయకుండా వస్తువులను రానిచ్చుటకై ప్రార్థించుచున్నాము.

